# ముత్తుస్వామిదీక్షితులు

రచన:

డా॥ ఆర్. అనంత పద్మనాభరావు

ప్రధానసంపాదకుడు:

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ:

శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1985

T. T. D. Religious Publications Series No- 224

SRĪNIVASA BALABHARATI - 40
( Children Series )

MUTTUSWAMY DIKSHITULU
by Dr. R. Anantapadmanabha Rao

*Chief - Editor :*
Dr S. B. Raghunadhacharya

First edition: 1985
Copies : 10, 000
Price : 1—00

***Published by :***
Sri S. Lakshminarayana I.A.S.
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati Devasthanam
Tirupati.

Art: GHĀYA

Printed at :
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

అల్లారు ముద్దుగా పెరిగే అందాలబాలల అద్దాల్లాంటి మనసులు ఎంతో నిర్మలమైనవి. వాటిముందు మనమెలాంటి సంస్కారాలను నిలిపితే అవే ప్రతిబింబిస్తాయి. చెరగని ముద్రవేసిన ఆ సంస్కారాలను వాళ్ళు భద్రంగా జీవితమంతా దాచుకుంటారు. భావిభారత పౌరులైన వారెంత సంస్కారంతో పెరిగితే, ఈ దేశాన్ని అంత చక్కగా తీర్చిదిద్దగలుగుతారు. కనుక మన సంస్కృతిలోని గొప్పదనాన్ని, భారతజాతికి పెట్టని అలంకారాలై ప్రపంచాన్ని అలరించే మంచిగుణాలను వాళ్ళకు ఉగ్గుపాలతో నూరిపోయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎన్ని విద్యలు నేర్చినా, ఎన్నెన్ని రంగాల్లో లబ్ధప్రతిష్ఠులైనా ప్రజల్లో ఈ సంస్కారం కొఱవడితే ప్రమాణాలు పడిపోయి జాతి అంధకారబంధురమౌతుంది. అందుకే మనదేశంలో పుట్టి, ఏదో ఒక ఆదర్శానికి అంకితమై మనకు గర్వకారణమైన మహాపురుషులు, మహాపతివ్రతల కథలు చిన్నారిపాపలకు అందుబాటులో ఉండేటట్లు చేయడానికే ఈ ప్రయత్నం. ప్రాచీన భారతీయుల మహత్తరాదర్శాలను పరోక్షంగా తెలియజేయడమే ఇందులోని ముఖ్యోద్దేశ్యం.

తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ సంకల్పంతోనే 'శ్రీనివాస బాలభారతి' అనే పుస్తకమాలను చిన్నపిల్లలకోసం ప్రకటిస్తున్నది. 'మీరు బాలభారతి' అన్నా మాకు, మా కుటుంబంలో అందరికి ఉపయోగిస్తున్న దంటున్నారు చాలామంది పెద్దలు. తాము చదివి తమపిల్లలచేత చదివిస్తే కొంతకు కొంత మా ఆశయం నెరవేరుతుంది.

ఈ బాలసాహిత్యాన్ని చక్కగా తీర్చి దిద్ది, మంచి రచనలను తయారుచేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్ పబ్లికేషన్స్, టి. టి. డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికకు సహకరిస్తున్న రచయితలకు, కళాకారులకు నాధన్యవాదాలు.

క్రోధన-ఉగాది
22—3—1985

ఎస్. లక్ష్మీనారాయణ, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక-ధార్మికాదర్శాలకు పేరు పడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి' 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం' 'ఇది నాకర్తవ్యం' అని ప్రతిబాలుడు, బాలిక ఈ దేశ సేవకు తనను అంకితం చేసుకొంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందరో మహానుభావులు మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మనవెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్ళను అర్థంచేసుకోవడం, వాళ్ళ చరిత్ర మననంచేసుకోడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ము తుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది, ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!

నిండుమనస్సుతో మీ కిదే మా స్వాగతం!

క్రోధన, ఉగాది
22-3-1985

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు.

అది కాశీపట్టణం. పవిత్రమైన గంగానది ఉరకలు వేస్తూ పారుతోంది. స్నానసంధ్యాదులు ముగించుకొని ఏదో ప్రార్థిస్తున్నాడతడు. క్షణాలుమాత్రమే గడిచాయి. చుట్టూ ఉన్నవారి ఆశ్చర్యానికంతులేదు. అతని చేతుల్లో ఒక దివ్యమైన వీణ వెలిసింది. ఆనందపరవశుడై దేవీదత్తమైన ఆ వీణను మీటుతూ చిందులు వేస్తున్నాడతడు. ప్రజలు పాదాభివందనం చేస్తున్నారు. అందటికీ ఒకే ప్రశ్న- ఎవరా మహానుభావుడు'? ఆయనెవరో కాదు; గురుగుహదయాపాత్రుడైన ముత్తుస్వామి దీక్షితులు, వాతాపి గణపతిం భజే' అని ప్రతినోట మనం వినే గణపతి ప్రార్థన ఆ 'నాదజ్యోతి'రచనే. సంగీతత్రిమూర్తుల్లో ఈయనకే 'దీక్షితార్' అనే ప్రసిద్ధి.

తంజావూరుజిల్లాలోని తిరువారూరుకన్న సంగీత త్రిమూర్తుల్లో మొదటివాడు త్యాగరాజు, మూడోవాడు. శ్యామశాస్త్రి, మధ్యమణి ముత్తుస్వామిదీక్షితులు

ఆయన జీవితమే ఒక సంగీత తపస్సు. కరువు కాటకాలతో అలమటిస్తున్న ఎట్టయాపుర ప్రాంతాన్ని చూసిన ఆయన హృదయం ద్రవించింది. అమృతవర్షిణీరాగంతో కృతినాలపించాడు. కుంభవృష్టి కురిసింది. ఆర్తులైన అక్కడి ప్రజల ఆనందానికి హద్దుల్లేవు. తను నేర్చిన విద్యతో లోకసేవ చేయాలనే ఉన్నతాదర్శానికి, నిరాడంబర జీవనానికి దీక్షితులు మనకు ప్రథమోదాహరణం కావాలి.

# ముత్తుస్వామిదీక్షితులు

సంగీతత్రిమూర్తులు:

అదొక శతాబ్దం. సంగీతసరస్వతి సామ్రాజ్యం చేసిన కాలమది. 1750–1850 మధ్యకాలం. సంగీతానికి సంబంధించినంత వరకు ప్రపంచదేశాల్లో ఎందరో మహానుభావులు ఆకాలంలోనే జన్మించారు. యూరపుదేశంలో బితోవన్, మొజార్ట్ మొదలైన ప్రముఖులు ఈ కాలంలోనే పుట్టారు. దక్షిణ భారతదేశంలో 'సంగీతత్రిమూర్తు'లనబడే త్యాగయ్య, దీక్షితార్, శ్యామశాస్త్రి ఈ కాలంలోనే జీవించారు. తెలుగులో కవిత్రయం నన్నయ. తిక్కన, ఎఱ్ఱనలకు ఎంత పేరు ప్రఖ్యాతులు వచ్చాయో, అలానే ఈ ముగ్గురికీ విశేషప్రచారం లభించింది.

వీళ్ళు ముగ్గురూ తంజావూరుజిల్లాలోని 'తిరువారూరులో జన్మించడం విశేషం. వీరి కృతులు మూడు భిన్న మార్గాలకు సంబంధించినవి. వీరికి జ్ఞానోపదేశం ముగ్గురు దేవలోక గురువులు చేయడం విచిత్రం. సంగీత ప్రపంచంలో త్యాగయ్య ఎంత మహానుభావుడో దీక్షితులవారు అంత గొప్పవారు. 1767–1847

మధ్యకాలంలో త్యాగరాజు, 1775_1835 సంవత్సరాలలో దీక్షితుల వారు; 1768_1827 నడుమ శ్యామశాస్త్రి జీవించారు.

తిరువారూరుకు ఎంత అదృష్టం:

ముగ్గురూ అలౌకిక జ్ఞానసంపన్నులే. త్యాగరాజులవారికి స్వయంగా నారదమహర్షి వచ్చి స్వరార్ణవమనే సంగీత గ్రంథాన్ని ఇచ్చాడు. అలానే దీక్షితులవారికి సుబ్రహ్మణ్యస్వామి నోటిలో కలకండవేసి కండచక్కెరలాంటి కీర్తనలు వ్రాసేందుకు దోహదం చేశాడు. శ్యామశాస్త్రికి సంగీతస్వామి జ్ఞానోపదేశం చేశాడు. త్యాగయ్య 24 వేలకుపైగా కృతులు రచించాడు. శ్యామశాస్త్రి, దీక్షితులు నాలుగువందల రచనలు చేశారు. తిరువారూరు చేసుకొన్న అదృష్టం అలాంటిది. సంగీత ప్రపంచంలోని ప్రసిద్ధుల్ని కన్న యోగ్యత ఆ ప్రదేశానికి దక్కింది. ముగ్గురు మహాగాయకులు తమ తమ యిష్టానుసారం ప్రాణాలు వదలిన విచిత్రఘట్టాలు చిరస్మరణీయాలు. వారిముగ్గురిలో వయస్సులో చిన్నవారు దీక్షితులవారు.

జననం:

తంజావూరు నాయకరాజుల పాలనలో సంగీత సాహిత్యాలకు ఆశ్రయమిచ్చిన రఘునాథనాయకుని కొలువులో గోవింద

దీక్షితులు మంత్రిగా ఉండేవారు. వారిది వేంకటమఖి సంప్రదాయం. వారివంశంలో రామస్వామిదీక్షితులకు జన్మించినవాడు ముత్తుస్వామి దీక్షితులు. రామస్వామి సంగీతంలో పేరున్నవాడు. హంసధ్వని రాగకర్త. ముత్తుస్వామికి బాలస్వామి, చిన్నస్వామి అనే ఇద్దరు సోదరులున్నారు. మన్మథనామ సంవత్సరం 1775 మార్చి 24 వ తేది రామస్వామి, సుబ్బమ్మల నోముల పంటగా కుమారుడు కలిగాడు. అది కృత్తికా నక్షత్రసమయం. తంజావూరుజిల్లాలోని వైదీశ్వరాలయంలోని ముత్తుకుమారస్వామి అనుగ్రహంవల్ల తమకు కుమారుడు కలిగాడని తల్లిదండ్రులు ముత్తుస్వామి అని పేరు పెట్టారు.

విద్యాభ్యాసం:

పువ్వుపుట్టగనే పరిమళిస్తుందన్నట్లు బాల్యంలోనే ముత్తుస్వామి తెలివితేటలు ప్రదర్శించాడు. ఏకసంథాగ్రాహి అయ్యాడు. గురువులకు అభిమాన శిష్యుడయ్యాడు. 16 వ సంవత్సరంలోనే వేదాలు చదివాడు. కావ్యాలు, నాటకాలంకారశాస్త్రాలు నేర్చుకొన్నాడు. సంగీతాభ్యాసం మొదలెట్టాడు. జ్యోతిషం, వైద్యం, మాంత్రికం-ఇలా శాస్త్ర రహస్యాలు తెలుసుకోవాలనే పట్టుదల పెరిగింది.

## బాల్యంలోనే కీర్తనలు:

సంస్కృతవిద్య చక్కగా నేర్చుకొని గేయరచనలో పతిష్ఠత సాధించాడు. తమిళ, తెలుగు భాషల్లో పాటలు వ్రాసినా సంస్కృతంపాలు హెచ్చు. వీరిది నారికేళపాకం. చిన్నతనం నుంచే దేవ్యుపాసనద్వారా శ్రీవిద్యను కరతలామలకం చేసుకొన్నాడు. జయదేవుని అష్టపదులను, మినహాయిస్తే సంస్కృతంలో యింతపతిష్ఠంగా కీర్తనలు రచించినవారు లేరు. తెలుగుభాష అప్పటికే గేయానుకూలమైన శైలికి వచ్చింది. తమిళంలో గోపాలకృష్ణభారతి రచనలు సాగిస్తున్నాడు. శబ్దానికి, నాదానికి అనుకూలంగా సంస్కృతంలో కీర్తనలు దీక్షితులు వ్రాశాడు.

## తనబాణీ తనది:

సంగీతంలో ప్రవేశం లభించింది మొదలు తన బాణీలో తాను పాడుకొనేవాడు. వీణానాదంతో మైమరచిపోయేవాడు. గురువులకది ఆశ్చర్యం కలిగించినా అతని ప్రతిభకు మెచ్చుకొనేవారు. భవిష్యత్తులో ఇతడొక ప్రతిభామూర్తి కాగలడని ఊహించారు. పూర్వజన్మ వాసనా ఫలితంగా ఇతడు సకలవిద్యలలోను పాండిత్యం సంపాదిస్తున్నాడని భావించారు. తోడిశిష్యులు అనురాగంతో చూసే

వారు. తల్లిదండ్రులు అల్లారుముద్దుగా పెంచారు. రామస్వామి దీక్షితులు తనవంశప్రతిష్ఠను నిలిపే వ్యక్తి తనకుమారులలో ప్రథముడైన ముత్తుస్వామి యని గర్వపడేవాడు.

## తండ్రివెంట కచేరీలకు:

కుమారునికి చిన్నవయసులోనే వివాహంచేశారు రామస్వామి దీక్షితులు. శాస్త్రాధ్యయనంలో తలమునకలైన ముత్తుస్వామికి ఇంటి ధ్యాసలేదు. నిష్ఠతో విద్యాభ్యాసం చేయడం, సంగీతోపాసన ఇవీ నిత్యకృత్యాలు. తండ్రితో కలిసి సంగీతకచేరీలకు హాజరయ్యే వాడు. మహారాజుల దగ్గర తనతండ్రి కానుకలు స్వీకరిస్తుంటే చూసి ఆనందించేవాడు. శ్రోతల్ని మైమరపింపజేసేలా సంగీత సాధన చేసేవాడు. ప్రత్యేకబాణీలో కీర్తనలు గానం చేసేవాడు.

## పరధ్యానం:

ముత్తుస్వామి ఎప్పుడూ సంగీతధ్యానమే తప్ప సంసారం గురించి పట్టించుకొనేవాడుకాదు. ఏమీ తెలియని వయస్సులో అతనికి వివాహం జరిగింది. ఇంట్లో అత్తమామలకు అనుగుణంగా నడుచు కొంటోంది కోడలు. ముత్తుస్వామి కాలకృత్యాలు తీర్చుకొని భగవంతుడి ధ్యానంలో కూర్చుంటే భోజనంవేళకు గాని లేవడు.

భోజనానంతరం కొంత విశ్రాంతి. సంగీతసాధనలో సాయంకాల మయ్యేది. ఇలా రాత్రింబవళ్ళు కుటుంబవిషయాలను పూర్తిగా మరచిపోయి ముత్తుస్వామి తిరగడం చూసిన తల్లిదండ్రులకు ఏమీ తోచలేదు. భార్యను గూర్చి ఒక్క క్షణంకూడా ఆలోచించని కుమారుడి పరధ్యానానికి వారు విస్తుపోయారు.

## రెండో పెళ్లి :

బంధువులంతా ముత్తుస్వామిని గూర్చి ఆలోచించసాగారు. అతడి పరధ్యానానికి కారణం భార్య రూపవతి కాకపోవడమను కొన్నారు. సంప్రదాయకుటుంబంలో పుట్టిన ఆ అమ్మాయి ఎంతో ముచ్చటగా ఇంటిపనులు సవరించేది. భర్త అనుగ్రహం కోసం ఎదురుచూసేది, కాని ముత్తుస్వామి అవేవీ పట్టించుకొనే స్థితిలో లేదు. ఎల్లప్పుడూ దైవచింతన. రెండో వివాహంచేసి, అందమైన కోడలిని తీసుకొనివస్తే కుమారునికి సంసారంపై వ్యామోహం పెరుగుతుందని బంధువులు సలహా యిచ్చారు. 'తథాస్తు' అన్నారు పెద్దలు. శాస్త్రోక్తంగా రెండో పెళ్ళి జరిపించారు. కాని ముత్తుస్వామి నడవడిలో ఏ విధమైన మార్పు రాలేదు. మూడు ముళ్ళు వేశాడే తప్ప సంసారతగులంలో చిక్కుకోలేదు. భగవద్భక్తి మరువ లేదు.

## మనలిసంస్థానం :

తంత్రి రామస్వామి సంగీతంలో మహావిద్వాంసుడు. ఒకనాటి కచేరీలో "మనలి" సంస్థానం జమీందారు ముత్తుకృష్ణ మొదలి యారు రామస్వామిసంగీతానికి పరవశులై పోయారు. పాదాభి వందనం చేసి చేతులు జోడించి అభ్యర్థించారు – "మీరు మా సంస్థానంలో పండితులుగా ఉంటే మహాభాగ్యంగా భావిస్తాం" జమీందారుగారి విన్నపానికి మౌనాంగీకారం తెలియజేశారు రామస్వామి. కుటుంబంతో సహా రామస్వామిదీక్షితులు "మనలి" సంస్థానానికి తరలిపోయారు.

## చిదంబరనాథయోగిఆశీస్సు :

ముత్తుస్వామి సంస్థానోద్యోగుల అభిమానాన్ని సంపా దించాడు. సంగీతసాధనలో పేరు గడించాడు. ఒకనాడు చిదంబర నాథయోగి అనే సంగీతవిద్వాంసుడు జమీందారు దర్శనానికి విచ్చేశాడు. కొంతకాలం అక్కడ సంగీతకచేరీలలో జమీందారు వారిని సంతోషపరచే ఉద్దేశంతో 'మనలి'లో రామస్వామియింట్లో బసచేశాడు. సంగీతకళారహస్యాలు చిదంబరనాథయోగి, రామస్వామి చర్చించుకొనేవారు. కొన్ని నెలలు ఇలా వారి సంభాషణలు ముచ్చ టగా సాగిపోయాయి. ఆ సంభాషణలన్నీ తదేకంగా విని మురిసి

పాయవాడు ముత్తుస్వామి. మధ్య మధ్యలో తనకుగల సందేహాలు నివృత్తి చేసుకొనేవాడు. సంగీతంపట్ల ముత్తుస్వామి అభిరుచికి చిదంబరనాథయోగి సంబరపడ్డాడు. పిల్లవానికి ఉజ్జ్వల భవిష్యత్తు గలదని ఆశీర్వదించాడు. తల్లిదండ్రులు ఆనందపరవశులయ్యారు.

### కాశీయాత్ర :

చిదంబరనాథయోగి అక్కడనుండి కాశీనగరానికి బయలు దేరాలని సంకల్పించాడు. గత కొద్దినెలలుగా రామస్వామి కుటుంబం తమ సన్నిహితత్వాన్ని పురస్కరించుకొని ఎంతో బాధగా వీడ్కోలు చెప్పారు. తనతో ముత్తుస్వామిని, అతని ఇద్దరు భార్యలనుగూడా కాశీకి ఆహ్వానించాడు యోగి. దూరప్రయాణమే అయినా, రామస్వామి అంగీకరించాడు. కుమారుని ప్రవర్తనలో మార్పు వస్తుందేమోనని ఆ తండ్రి ఆశ ! చిదంబరనాథయోగితో ముత్తుస్వామి, సకుటుంబంగా కాశీకి వెచ్చేశాడు. కాశీవిశ్వనాథుణ్ణి సేవిస్తూ కొంతకాలం గడిపాడు.

### మంత్రోపదేశం :

చిదంబరనాథయోగికి ముత్తుస్వామిపై ఎనలేని వాత్సల్యం ఏర్పడింది. భగవద్భక్తితత్పరుడైన యువకునిపై యోగికి అవ్యాజానురాగం కలిగింది. లౌకిక సుఖ సంసారాది వ్యామోహాలపట్ల

నిశ్చింతగా ఉన్న ముత్తుస్వామికి మంత్రోపదేశంచేస్తే బాగుంటుందని సంకల్పించాడు యోగి. ఒక శుభముహూర్తంలో శ్రీవిద్యామంత్రోప-దేశం చేశారు. నిష్ఠగా మంత్రజపం చేశాడు ముత్తుస్వామి తదేకచిత్తంతో, నిశ్చలధ్యానంతో మంత్రజపం చేస్తున్న ముత్తుస్వామిదీక్షకు యోగి ఆనందించాడు.

సంగీతసాధన!

సూర్యోదయంకాగానే గంగానదీతీరంలో స్నానం చేసి కాశికావిశ్వేశుణ్ణి, అన్నపూర్ణను సేవించి అపరాహ్ణసమయానికి ఇంటికి చేరేవాడు ముత్తుస్వామి. భార్యలిద్దరు అనుకూలంగా వంటా, వార్పు చేసి భర్తను ప్రసన్నుణ్ణి చేసుకోవాలని ఉబలాటపడేవారు. సాయంసమయాలలో విహారంగా వెళ్ళి సంగీతసాధనలో లీనమయ్యే వాడు. పండుగలు, పర్వాలు గడచిపోయాయి. ఐదు సంవత్సరాల కాలం మంత్రజపంలో మరో ప్రపంచమే మరిచిపోయాడు ముత్తుస్వామి. దేవ్యుపాసనతో తేజస్సు ఆవరించింది. భార్యలిద్దరూ తిరిగి స్వగ్రామానికి వెళ్ళిపోదామని భర్తను బ్రతిమాలారు. యోగి ముత్తుస్వామికి మంత్రసిద్ధి కలిగిందని, సంస్థానానికి తిరిగి వెళ్ళ వచ్చునని ఆదేశించారు.

ముత్తుస్వామికి సంతృప్తి కలగలేదు. మంత్రసిద్ధి అయినట్లుగా తోచడంలేదని యోగితో సందేహం వెలిబుచ్చాడు. మంత్రోపాసనలో తానేమీ లోపం చేయకపోయినా, దేవి తనపట్ల అనురాగం చూపలేదేమోనని అనుమానం వ్యక్తం చేశాడు. చిన్నతనంనుంచి తనకు భగవద్భక్తి ఉన్నందున దేవి కరుణాకటాక్షవిలాసం ముత్తుస్వామికి లభించిందని యోగికి తెలుసు. సంగీతసాధనలో పారమ్యం లభించగలదని తెలుసు. అయినా ముత్తుస్వామికి గల సందేహం తీర్చాలని భావించాడు. అతని ప్రవర్తనలో మార్పు రాగలదనుకొన్నాడు.

నీ కోరిక సిద్ధిస్తుంది!

మరునాడు ఉదయాన్నే లేచి గురుశిష్యులు ఇద్దరూ గంగానదీ తీరానికి వెళ్ళారు. సూర్యుడికి అర్ఘ్యమిచ్చాడు ముత్తుస్వామి. సందేహంగా 'యోగిపుంగవా! నాకు మంత్రసిద్ధి కలిగినట్లు తార్కాణ లభించడంలేదు'—అన్నాడు ముత్తుస్వామి. "నీకా అనుమానం అక్కరలేదు. రేపటిదినం నీవు ఒంటరిగా నదీస్నానానికి వచ్చినపుడు మంత్రోపాసనచేసి మోకాటినీటిలో నిలబడి రెండుచేతులు నీళ్ళలో వెల్లకిలబెట్టి నీ మనసులో కోరికను ధ్యానించు. నీవు చేతులు ఆకాశంవైపు ఎత్తగానే నీ కోరిక సిద్ధిస్తుంది" అన్నాడు

యోగి. ఆ రోజంతా ముత్తుస్వామి మరింత భక్తిశ్రద్ధలతో దేవిని ధ్యానించాడు. త్రికరణశుద్ధిగా ఉపాసనచేశాడు.

ఆ వీణను నాకు బహూకరించు :

సూర్యోదయం యథావిధిగా నదీస్నానానికి వెళ్ళాడు. పురోహితులు చుట్టూ చూస్తూనే నిలుచున్నారు. నదిలో మునకవేసి లేచాడు ముత్తుస్వామి. గాయత్రీమంత్రాన్ని ఉచ్చరించాడు. అర్ఘ్యప్రదానం చేశాడు. శుచియై దేవీమంత్రజపంచేశాడు. యోగి సెలవిచ్చిన ప్రకారం మనస్సులో కోరిక బయటబెట్టాడు. అస్పష్టంగా వినిపిస్తున్న వాక్యాలను పక్కనే స్నానం చేస్తున్నవారు ఆలకించి అబ్బురపడుతున్నారు. మరికొంతరు పిచ్చివాడని భ్రమపడుతున్నారు. "దేవీ ! ఏ వీణానాదంతో జగత్తునంతా మైమరపింపజేసే శక్తిగలదో, సృష్టికర్తయైన బ్రహ్మకు ప్రియంగా సరస్వతీదేవి ఏ వీణాతంత్రులను మీటి ఆనందాన్ని గలిగింపజేస్తుందో, అలాంటి వీణా వాద్యాన్ని నాకు బహూకరించు" అని ధ్యానంచేశాడు ముత్తుస్వామి. ముఖంలో తేజస్సు దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది. మరుక్షణంలో అతని పవిత్రహస్తాలలో సాధారణ వీణలకంటె చిన్నది, అతి తేజోవంతమైనది అయిన వీణ ప్రత్యక్షమైనది. కసులకద్దుకొని తంత్రులు మీటాడు ముత్తుస్వామి. నదినుండి వెలుపలికివచ్చి ఆనందతాండవం

చేశాడు. (దీక్షితుల వంశీయుల ఇంట్లో ఇప్పటికీ ఈ వీణ పూజలు అందుకొంటోంది.)

తిరిగి మనలి సంస్థానానికి :

ఆ అద్భుత శక్తిని జూసి చుట్టూ ఉన్నజనం ఆశ్చర్య చకితులై పాదాభివందనం చేశారు. అతని మహత్తరశక్తిని వేనోళ్ళ కొనియాడారు. దేవి ప్రసన్నమై యిచ్చిన వీణను స్పృశించి తమ జీవితాలు ధన్యమైనట్లుగా భావించారు. కారణ జన్ముడైన ముత్తుస్వామిని అభినందనలతో ముంచెత్తారు. దివ్యప్రసాదమైన ఆ వీణను చూసి యోగి సంతోషించాడు. ముత్తుస్వామికి అష్టమహాసిద్ధులు అందేలా మంత్రోపదేశం చేశాడు. ఇతడు మహాపురుషుడు కాగలడని చాటిచెప్పాడు. వేదాంతశాస్త్రాన్ని క్షుణ్ణంగా ఉపదేశించి మనలి సంస్థానానికి తిరిగి వెళ్ళవలసిందిగా సూచించాడు. యోగికి అవసానకాలం సమీపించిందని తెలుసు. తనవల్ల ముత్తుస్వామికి ఏవిధమైన ఇబ్బందులు కలగరాదని అలా ఆశీర్వదించాడు. ముత్తుస్వామి ఇద్దరు భార్యలతో ప్రయాణమయ్యాడు. దారిపొడుగునా ముత్తుస్వామి మహత్త్వం కర్ణాకర్ణిగా విన్న [illegible] అతిథి సత్కారాలు చేశారు.

మనలి సంస్థానాధీశుడు నగరం వెలుపలికివచ్చి పూర్ణకుంభ స్వాగతం పలికాడు. మహాపురుషునిరాకలాగా జయ జయధ్వానాలు చేశారు పురజనులు. దేవతల్ని ప్రసన్నుల్ని చేసుకొనే యత్నంలో ముత్తుస్వామి అంతర్యాగ, బహిర్యాగాలు నడిపించాడు. తల్లిదండ్రుల సేవలో జన్మచరితార్థమైందని భావించాడు. వారికుటుంబానికి ఏ లోటు రాకుండా జమీందారు సకలోపచారాలు చేస్తున్నాడు. మంత్రో పాసన ఏమరకుండా చేస్తున్నాడు ముత్తుస్వామి. ఐహికసుఖాలపై క్రమక్రమంగా చూపు సన్నగిల్లింది. కేవలం గార్హస్థ్య జీవితంలో భాగస్వాములుగా భార్యలిద్దరినీ చూసేవాడు. సంతానం లేదనే చింత భార్యలిద్దర్నీ పీడిస్తోంది. ఆ విధమైన చింతనలేదు ముత్తు స్వామికి. కాలం దొర్లిపోతోంది. రామస్వామికి ముత్తుస్వామి దైవభక్తిచూస్తే ఎంతో ఆనందం!

**తిరుత్తనిలో ముత్తుస్వామి :**

మనలిలో చిరకాలం నివాసం చేసిన తర్వాత సుబ్రహ్మణ్య స్వామి క్షేత్రమైన తిరుత్తనికి వెళ్ళాలని ముత్తుస్వామి సంకల్పిం చాడు. కుటుంబంతో తిరుత్తనికి బయలుదేరాడు. జమీందారు ఎంతో బాధపడ్డాడు. తమవంటి సంగీతవిద్వాంసులు మా సంస్థానంలో ఉంటే బాగుండేదని విచారం వ్యక్తంచేశాడు. భగవత్సంకల్పం

ఎలా ఉంటే అలా జరుగుతుందని ముత్తుస్వామి తిరుత్తని చేరు కొన్నాడు. నిత్యం కొండమీద దేవాలయానికి వెళ్ళి సుబ్రహ్మణ్యేశ్వ-రుణ్ణి దర్శించి తన గానామృతంతో స్వామిని కొలిచేవాడు.

కుటుంబపోషణ ముత్తుస్వామి ఆలోచించకుండా జరిగి పోతోంది. మనలి జమీందారు కుటుంబపోషణ భారాన్ని స్వీకరించి ఏటేటా కానుకలు పంపిస్తున్నారు. అభిమానులు, శిష్యులు ఆదరంగా చూసుకొంటున్నారు. ముత్తుస్వామి సంగీతసాధన, దైవచింతన తప్ప ఇతర ప్రపంచాన్ని మరచిపోయాడు. తిరుత్తని వచ్చిన తర్వాత మనసుకేదో ప్రశాంతి లభించినట్లు అనిపించింది.

ఇదిగో భగవత్ప్రసాదం, నోరుతెరు!

ఒక సాయంకాలం గర్భగుడి కెదురుగా కూర్చొని ముత్తుస్వామి ధ్యాననిమగ్నుడయ్యాడు. చీకటిపడుతోంది. పక్షుల కిలకిలారావాలు సన్నగిల్లాయి. ఆలయసమీపంలో భక్తులు లేరు. ఆలయగంటను ఎవరో మ్రోగించారు. ఒకసాధువు ఆలయంలోంచి ముత్తుస్వామి సమీపానికి వచ్చేశాడు. ముత్తుస్వామి పంచాదశాక్షరీ మహామంత్రజపం చేస్తున్నాడు నిష్ఠగా. సాధువు మహాతేజోమూర్తిగా కనిపిస్తున్నాడు. ఒక్కక్షణం కళ్లు తెరచి చూసిన ముత్తుస్వామి సాధువుకు సాష్టాంగ నమస్కారం చేశాడు.

"నాయనా! నీవు ధ్యాన నిమగ్నుడవై ఉండటం చూసి నాకెంతో ఆనందం కలిగింది. భగవత్ ప్రసాదం తెచ్చాను. ఇదుగో నోరు తెరు' అని సాధువు కండచక్కెర ముత్తుస్వామి నోట్లో వేశాడు.

"మహాప్రసాదం" అని స్వీకరించాడు ముత్తుస్వామి.

"జయోస్తు" — అంటూ సాధువు కనుమరుగయ్యాడు. క్షణకాలం కలలోంచి తెలివి వచ్చినట్లుగా చూశాడు ముత్తుస్వామి.

కొత్తకీర్తన:

జనసంచారంలేని ఈ సమయంలో సాధువురాలేదనీ, సాక్షాత్తు ఆ సుబ్రహ్మణ్యేశ్వరుడే తనను అనుగ్రహించి ప్రసాదం దయచేశాడని తెలిసింది. శరీరం ఆనందంతో పులకలు వేసింది. కంఠంలో అవ్యక్త మధురామృతధారలు ప్రవించాయి. మనోల్లాసం కలిగింది. మధురానుభూతిలో కవితావేశం పొంగిపొరలింది. శ్రీనాథాది గురుగుహో జయతి అని ఎలుగెత్తి కీర్తన గానంచేశాడు. తన పలుకులు తనకే ఆశ్చర్యం కలిగించాయి. కొత్తకీర్తన సరిక్రొత్త రీతిలో వెలువడించి.

ఇంటి ముఖం పట్టాడు ముత్తుస్వామి. ఆ సంఘటన తీపి గుర్తులు మనసులో మెదలుతున్నాయి. ఆదితాళంలో మాళవగౌళ రాగంలో వెలువడిన ఆ కీర్తన అద్భుతంగా వినిపించింది. పల్లవిలో సరళీవరుస, జంటవరుసలు, అనుపల్లవిలో అలంకారరీతులు పలికాయి. తన మొట్టమొదటి కీర్తన ఆ పరాత్పరుని అనుగ్రహ ఫలితమని ఊహించి పులకించిపోయాడు. మార్గమధ్యంలో మరో కీర్తన అప్రయత్నంగా వెలువడింది. ఆనందభైరవిరాగంలో "మానసగురుగుహ" కీర్తన గానం చేశాడు.

## గురుగుహునిపై ఏడు కీర్తనలు :

ఇంటిదగ్గర శిష్యులు గురువుగారి మహానందాన్నిచూసి ఆశ్చర్య పోయారు. శిష్యులకు రెండు కీర్తనలు వినిపించాడు. క్రమంగా తిరుత్తణి గ్రామవాసుల కందరికీ ఈ వార్త ప్రాకిపోయింది. కండ చక్కెరలలాంటి పలుకులు భగవత్ప్రసాదమని అందరూ వేనోళ్ళ కొనియాడారు. ముత్తుస్వామి తపస్సు ఫలించి స్వామి కనిపించా డని అభినందించారు. భక్తులు ముత్తుస్వామి భగవంతుని దర్శించిన మహనీయుడని పాదాభివందనం చేశారు. ముత్తుస్వామి మనః ఫలకంపై ఆ సంఘటన చెరగనిముద్రవేసింది. తనకు మధుర మైన వాక్కును ప్రసాదించిన ఆ గురుగుహుని పేర ఏడు కీర్తనలు రచించి ఆనందంగా గానంచేశాడు. ఒక్కొక్క విభక్తిలో ఒక్కొక్క కీర్తన వెలువడింది.

వాతాపిగణపతిం భజే!

తిరుత్తని దేవాలయప్రాకారంలో ఒకచోట త్రికోణాకృతిలో వినాయకవిగ్రహం ఇమిడి ఉంది. ప్రణవస్వరూపంలోఉన్న ఆ గణపతి నుద్దేశించి రచించిన కీర్తనయే వాతాపిగణపతిం భజే. ఈ కీర్తన సంగీతవిద్వాంసులనోట కచేరీలలో ఆరంభకీర్తనగా గానం చేయబడుతోంధి. హంసధ్వనిరాగంలో ఆ కీర్తన మధుర మధురంగా సాగిపోతుంది. తిరుత్తనిలోని కమలాంబాదేవి ఆలయంలో దేవి ఈశాన్యముఖంగా ప్రతిష్ఠితమైంది. రాత్రివేళలలో ముత్తు స్వామి ప్రాకారాలలో ద్వారానికి దగ్గరగా సుమారు అరఫర్లాంగు దూరంలో వీణవాయిస్తూ దేవియొక్క దీపారాధన తిలకించేవాడు. ఆ దేవిదర్శనభాగ్యమే వారిని కృతకృత్యులను చేసింది.

పంచముఖవాద్యం:

ఆ దేవాలయంలో మరో విచిత్రముంది. అక్కడ పంచ ముఖ వాద్యముంది. పెద్ద హండాలాంటి పాత్రలాగానున్న వాద్యమది. పంచలోహాలతో చేయబడ్డ దానికి అయిదుతలలు. తోలుతో బిగిం చిన మూతులపై వాదనంచేస్తే ఒకొ్కక్కముఖం ఒకొ్కక్క శృతి నిస్తుంది. రెండుచేతులతో దీనిని సామగానక్రమంలో ముత్తు

స్వామి వాయించేవాడు. మద్దెలలజోడులాగా శబ్దించేసేది. ఇది ఆ ఆలయంలో వాయించడానికి ముత్తుస్వామికే హక్కు. ఆ విధంగా ఆలయధర్మకర్తలు చట్టంచేశారు. (ఇప్పటికీ దీక్షితులవారి వంశీయులు ఆ మృదంగవాదనం చేస్తున్నారు.)

అంతులేని శిష్యగణం!

ఆ కాలంలో దీక్షితులవారి చుట్టూ శిష్యజనమే. తిరుక్కాడయూరు భారతి, వీణ వెంకటరామయ్య, సుబ్రహ్మణ్యయ్య, తంబియప్పడు, తంజావూరు పొన్నయ్య, పడిపేలు, రామస్వామి బిల్వపనం, అయ్యాస్వామి, కమలం, పళ్ళలాదుగుడి అమ్మణ్ణి—ఇలా శిష్యబృందం తనచుట్టూ చేరి కీర్తనలు ఆలపించేవారు. సంగీతశాస్త్ర రహస్యాలు గ్రహించేవారు. జంత్రవాద్యాలలో ఆరితేరి రాజసమ్మానాలు అందుకొనేవారు. గురుభక్తితో ముత్తుస్వామివారిని ఆరాధించేవారు.

నవగ్రహకృతులు:

శిష్యులపై దీక్షితులకు విపరీతమైన అభిమానం. ఒకసారి శుద్ధమత్తళం తంబియప్పన్ అనే శిష్యుడికి భరింపరాని కడుపునొప్పి వచ్చింది. ఆ సమయంలో మెలికలు తిరిగిపోయేవాడు. ఆహారం

స్వీకరించేవాడుగాదు. దీక్షితులు అతని విపరీతవేదనచూసి జాలి పడ్డాడు. జ్యోతిష్కులు తంబియప్పన్ జాతకంచూసి గురు, శని గ్రహాలు సరిలేవని, దానిఫలితంగా కడుపునొప్పి వచ్చిందనీ హెచ్చరించారు. దీక్షితులావిషయం తెలుసుకొని బాగా ఆలోచించాడు. ఎలాగైనా అతని బాధను పోగొట్టాలని సంకల్పం. బృహస్పతి కవచస్తోత్రమంత్రార్థాల సారం చేర్చి అఠాణారాగంలో ఒక కీర్తన రచించాడు. 'బృహస్పతే తారాపతే బ్రహ్మజాతే నమోస్తుతే' అనే పల్లవిలో వెలువడిన ఆకీర్తన అత్యంత మధురమైనది. యదుకుల కాంభోజిరాగంలో "దివాకర తనూజం శనైశ్చరం, ధీరతరం సంతతం చింతయేఽహం" అనే కీర్తన శనిగ్రహ పరంగా రచించారు.

ఓరోజు ఏకాంతంగా తంబియప్పన్‌కు ఆకీర్తనలు చెప్పి నిష్ఠగా గానం చెయ్యమని ఆదేశించాడు. పదిరోజులలో తంబి యప్పన్ ఏవిధమైన బాధలేక హాయిగా తిరగసాగాడు. ఆ రెండు కీర్తనలు లోకంలో బాగా ప్రచారంలోకి వచ్చాయి. తక్కిన గ్రహాల మీదకూడా కీర్తనలు రచించి గానంచేసి ఆనందించారు. నవగ్రహ కృతులుగా అవి లోకంలో ప్రసిద్ధికెక్కాయి. అలానే కమలాంబా నవావర్ణ కీర్తనల పేరుతో తొమ్మిది కృతులు రచించారు.

దీక్షితుల కీర్తనలు శిష్యసముదాయం లోకంలో ప్రచారానికి తెచ్చారు. కచేరీలలో గానం చేయడంద్వారా వ్యాప్తిలోకి వచ్చాయి. సంగీతంలో పుష్టి, శబ్దాలలో సౌకుమార్యం దీక్షితులసొత్తు. దీక్షితుల వారి బాణీని తరువాత వచ్చిన పదకర్తలు, వాగ్గేయకారులు అనుసరించారు.. భావానుగుణంగా రచనలు సాగించిన కీర్తి త్యాగయ్యకు దీక్షితులకు లభించింది.

## కాంచినివాసం:

దీక్షితులవారు సకుటుంబంగా కాంచీపురానికి విచ్చేశారు వారిని శిష్యులు, తమ్ముళ్ళు అనుసరించివచ్చారు. కంచికామాక్షిని సేవిస్తూ నాలుగుసంవత్సరాల కాలం గడిపారు. ఆమెసన్నిధానంలో శ్రీవిద్యోపాసన బాగా సిద్ధించింది. వయసు క్రమంగా పైకొనింది. తమ్ములు చినస్వామి, బాలస్వామి అన్నగారి వెంబడి కీర్తనలు గానంచేస్తూ ప్రచారంలోకి తెచ్చారు. కామాక్షీసన్నిధానంలో 'కంజదళాయతాక్షి' 'ఏకామ్రనాథం భజేహం' అనే కీర్తనలు రచించారు. గేయరచనలో నూర్ద్వం దీక్షితులకు వరంలా లభించింది.

## ఉపనిషద్బ్రహ్మస్నేహం:

ఏకామ్రనాథేశ్వరుని సేవ, కామాక్షీదేవి కొలువు, ఇవి తప్ప మరో ప్రపంచంలేదు దీక్షితులవారికి. కాంచీపురవాసియైన ఉ. నిష

ద్బ్రహ్మం గొప్పవేదాంతి. వేదాంతశాస్త్ర రహస్యనిధి. సాయం కాలాలలో వారితో దీక్షితులు గోష్ఠి చేసి వేదాంతరహస్యాలు గ్రహిం చారు. ఆయన రచించిన రామాష్టపదులకు స్వయంగా దీక్షితులవారు వర్ణక్రమాలలో రాగతాళాలను ఏర్పరచారు. అప్పటినుంచి దీక్షితులవారి హృదయంలో వేదాంతధోరణి చోటుచేసుకొంది.

అష్టాదశముద్రలు :

దీక్షితులవారి కీర్తనలలో లయాత్మకగుణం తక్కువ. కాని రాగ సంచారం, గమకవిశేషం-గానం చేసే సమయంలో శ్రోతలను మైమరపింపజేస్తాయి. త్యాగయ్య అఖిలభారత ఖ్యాతినార్జించాడు. శ్యామశాస్త్రికీర్తనలు ప్రసిద్ధిలోకి వచ్చాయి. అదే సమయంలో సంగీతప్రపంచంలో దీక్షితులవారు తమదైన స్థానాన్ని నిలుపు కొన్నారు. తనరచనల్లో రాగముద్ర, వాగ్గేయకారముద్ర, క్షేత్ర ముద్ర, ప్రబంధముద్ర. రాజముద్ర, మొదలుగా అష్టాదశముద్రలు కనిపిస్తాయి. ఏ ప్రాంతంలో గానం చేసింది స్పష్టమయ్యేందుకు అవకాశం కలిగింది. ఆయాక్షేత్రాలను సందర్శించినపుడు ఆయన సంతోషపారవశ్యంలో కీర్తనలు రచించి గానంచేయడం విశేషం.

దీక్షితులు తిరువారూరు చేరాడు :

తిరిగి తిరువారూరుకు వెళ్ళిపోవాలని దీక్షితులు నిర్ణయించారు కంచిలో స్నేహితులు, శిష్యులు, భక్తులు 'ససేమిరా' వెళ్ళడానికి.

పేలులేదన్నారు. 'నాలుగు సంవత్సరాలు మీతో కలసిమెలసి జీవించాం. మీతో మేము వస్తా'మని హంగామాచేశారు. వేదాంత యోగియైన ఉపనిషత్‌బ్రహ్మం వారిని వారించాడు. వ్యక్తి తన గ్రహచారాన్ని అనుసరించి నివాసం ఏర్పరచుకొంటాడని. దీక్షితులు ఎక్కడ నివసించినా పేరుప్రఖ్యాతులు లభిస్తాయని ఆశీర్వదించాడు. తమ్ముళ్ళతోను, కుటుంబంతోను దీక్షితులు తిరువారూరు వచ్చేశారు. అప్పటికి త్యాగరాజు బాగా నాదబ్రహ్మమయ్యాడు.

గురుగుహముద్రతో క్షేత్రదైవమైన త్యాగరాజేశ్వరుని మీద అనేకకీర్తనలు రచించి గానంచేశాడు దీక్షితులు. తిరువారూరి లోని ఆనందేశ్వర, సిద్ధేశ్వర, అచలేశ్వర, హాటకేశ్వర, వల్మీకేశ్వరులమీద ప్రత్యేకంగా కీర్తనలు జతపరచాడు.

పంచలింగకృతులు :

ముద్దుముద్దుపలుకులతో ముత్తుస్వామిదీక్షితులు పంచలింగస్థల కృతులు రచించారు. కంచి ఏకామ్రనాథేశ్వరుని పరంగా 'చింతయ మాం'కృతిని, తిరువానైక్కావలీశ్వరుని పేర 'జంబూపతే, కీర్తనను, అరుణాచలేశ్వరునిపై 'అరుణాచలనాథ' గేయాన్ని. 'శ్రీకాళహస్తీశ' ముద్రతో కాళహస్తీశ్వరుణ్ణి, చిదంబరేశుని

ఆనందనటన'మనే మధురకృతితోను భక్తి పరవశుడై గానం చేశాడు. వీరు తానవర్ణాలను, రాగమాలికలను, అపూర్వరాగాలలో గానంచేసి చరితార్థులయ్యారు.

నవావర్ణ కృతులు :

నవావర్ణకృతుల పేరుతో కమలాంబికాపరంగా రచించిన తొమ్మిదికృతులు మధుకుల్యలు. తిరువారూరికి సమీపంలోని విఘ్నేశ్వరులపై రచించిన 16 కృతులు షోడశ గణపతికృతులుగా ప్రసిద్ధాలు. 'వాతాపిగణపతిం భజే' ఆ పదహారు కృతులలో ఒకటి. 'శ్రీమహాగణపతి' 'పంచమాతంగముఖ' 'శ్రీమూలాధార' అనే కృతులు కూడా లోకంలో బాగా వాడుకలోకి వచ్చాయి.

తిరువారూరులోనే ఉంటాను :

అసాధారణమైన వాగ్ధోరణి, సంస్కృతసాహిత్యంపై అధికారం, అద్వైతభావన ముప్పిరిగొనగా వేంకటమఖి సంప్రదాయ రాగాలతో దీక్షితులు కీర్తనలు రచించారు. తమ్ములు, శిష్యులు, వాటిని ప్రచారం చేశారు. మధురప్రభువులు ఆ కీర్తనల మాధుర్యానికి మెచ్చి దీక్షితులవారిని తమ సంస్థానానికి ఆహ్వానించారు కాని, తిరువారూరులోనే నివాసం చేయాలని నిర్ణయించుకొన్నారు.

తమ్ములు చిన్నసామి, బాలస్వామి ప్రభువుల కోరిక తీర్చడానిల బయలుదేరారు. రసికప్రభువుల ఆదరానికి పాత్రమై వారిరువురు కొంతకాలం మధురలో కాలక్షేపం చేశారు. అన్నగారికి ప్రభువు కానుక లందజేస్తూవచ్చారు. కొంతకాలానికి చిన్నస్వామి కాల ధర్మం చెందాడు.

ఎట్టయపురంలో బాలస్వామి:

తమ్ముని మరణం బాలస్వామికి విపరీతవియోగవ్యథ కలిగించింది. ఆ బాధ తట్టుకోలేక పోయాడు. విరక్తి కలిగి హరి అనే శిష్యుని వెంటబెట్టుకొని అక్కడనుంచి తీర్థయాత్రలు బయలు దేరాడు. సేతువులో రామలింగేశ్వరునికి పూజలుచేసి ఎట్టయపురం ప్రవేశించాడు. అక్కడి మహారాజు అంతకుముందే దీక్షితుల సోదరుల సంగీతప్రావీణ్యం తెలిసినవ్యక్తి కాబట్టి బాలస్వామిని తనసంస్థానంలో విద్వాంసునిగా నియమించి సమ్మానించాడు.

తిరిగి తీర్థయాత్రలు:

తమ్ముడి మరణం, బాలస్వామి జాడతెలియకపోవడం దీక్షితులవారి హృదయాన్ని కలచివేశాయి. తనకు సంతతి లేక పోయినా, పినతమ్ముడే తన సంతతిగా భావించుకొనే దీక్షితులవారికి

అది భరింపరానిదైంది. వేదాంత వాసనవల్ల భ్రాతృవియోగం లోకసహజమనే నిర్ధారణకొచ్చారు. కాని, తమ్ముడు విరక్తితో ఎక్కడికెళ్ళాడోననే చింత బయలుదేరింది. వయోభారం శరీరంపై పనిచేస్తోంది. యాత్రలుచేసే స్థితిలో లేదు. అయినా తమ్ముడిపై మమకారంతో బయలుదేరక తప్పిందిగాదు.

కలలో గురుగుహానుగ్రహం:

మానసికంగా ఆవేదన కలిగింది. ఆ సాయంకాలం చంద్రోదయ సమయంలో నవగ్రహకీర్తనలలో తాను రచించిన 'చంద్రం భజ' అనే కీర్తన ఇలా ఆలపించాడు దీక్షితులు.

చంద్రం భజ మానస
సాధుహృదయసదృశం.
ఇంద్రాదిలోకపాలేడిత తారేశం
ఇందుం షోడశకలాధరం నిశాకరం
ఇందిరా సహోదరం సుధాకరమనిశం
శంకరమౌళివిభూషణం
శీతకిరణం చతుర్భుజం
మదన చ్ఛత్రం క్షపాకరం వెంకటేశనయనం

విరాణ్మనో జననం—విధుం కుముదమిత్రం
విధి గురుగుహవక్త్రం.
శశాంకం—గీష్పతేః శాపానుగ్రహపాత్రం
శరచ్చంద్రికా ధవళప్రకాశగాత్రం
కంకణకేయూరహారమకుటాదిధరం

పంకజరిపుం రోహిణీప్రియకరచతురం. ॥చంద్రం॥

మనోహరంగా విరిసిన పండువెన్నెల్లో కీర్తన ఆలపిస్తూ ఆదమరచి నిద్రపోయారు దీక్షితులు. స్వాప్నిక జగత్తులో తాను భగవంతుని సాన్నిధ్యంలో ఉన్నట్లు స్ఫూర్తి కలిగింది. గురుగుహ మూర్తి తన ననుగ్రహించినట్లు తోచింది. ప్రయత్నిస్తే తన తమ్ముడు ఎక్కడో కనిపించగలడనే స్ఫూర్తి కలిగింది.

రెప్పపాటులో ఆ స్వప్నావస్థలోంచి వెలికివచ్చారు. ఏకాంతం విడిపోయింది. శిష్యులకు తాను పొందిన అనుభూతిని వివరించారు.

## శాత్తూరులో ముత్తుస్వామి:

మరునాడు ఇద్దరుభార్యలు, శిష్యుడు సుబ్రహ్మణ్యయ్య వెంట రాగా దీక్షితులు మదురకు ప్రయాణమయ్యారు. శాత్తూరుకు చేరు కొన్నారు. అక్కడ శాత్తూరి పెరుమాళ్ళు దివ్య వైభవంగా వెలు

గొందడం చూచారు. భక్తబృందం స్వామిని సేవించి కొంగు బంగారంగా కోర్కెలు సాధించడం చూశారు. తన తమ్ముడిజాడ ఈ స్వామి కరుణాకటాక్షఫలితంగా లభించగలదని భావించారు. గుడివాకిలిమండపం దగ్గర దిగి పూజాదికాలు ప్రారంభించారు. భార్యలిద్దరు పెరుమాళ్ళ పరిచర్యలో తోడ్పడ్డారు. కైంకర్యం పూర్తి చేసిన పిదప నాలాయరప్రబంధం చదువుతూ క్షణకాలం ధ్యానంలో మునిగాడు దీక్షితులు.

స్వామికోవెలలో ఆరాధన ముగిసింది. భగవత్ ప్రసాదం స్వీకరించి తిరిగివెళ్తున్న భక్తబృందం గుడిమంటపంలో క్రొత్తగా వచ్చిన యాత్రికుల్ని చూసిపోతున్నారు. ముత్తుస్వామి దీక్షితుల ప్రఖ్యాతి అప్పటికే మారుమూల ప్రాంతాలకుగూడ ప్రాకింది. అతని మహిమలు గొప్పగా చెప్పుకొని అనందించే రోజులవి. కొందరు ఆయనకు పాదాభివందనం చేసి ఆయన వృత్తాంతం అడిగి తెలుసుకొంటున్నారు. మరికొందరు వారి నవగ్రహస్తోత్ర మాలికలో కీర్తన పాడించుకొంటున్నారు. కాని, దీక్షితుల మనసులో ఆందోళనఛాయలు మొహంపై కనిపిస్తూనే ఉన్నాయి. తమ్మునిజాడ వీరెవరికైనా తెలుసేమోనని అతని ఆశ. నోరుతెరచి అడగడానికి సంశయం.

బాలస్వామి వివాహవార్త :

కొందరు యువకులు చుట్టూచేరిన జనసమూహం మధ్యఉన్న దీక్షితులవారిని చూశారు. వారికి సంగీత సాహిత్యాల ఊసేపట్టినట్లు లేదు. వారిలో ఒకరితో నొకరు ఇలా అనుకొంటున్నారు.

'ఒరే! సుదర్శనం; ఎట్టయపురం మహారాజా వారి పేరు విన్నావా!'

'అయ్యో! రామ! ఆ మహారాజులవారినిగూర్చి తెలియని వారెవరురా!

'ఆయన సంగీతమంటే చెవికోసుకొనేవ్యక్తి. కళాభిమాని!

'ఒరే! కృష్ణమాచారీ! నీవొక క్షణం అయితే నాకు ఎట్టయాపుర సంస్థాన చరిత్ర చెప్పేలాగున్నావు. ఇంతకూ విషయమేమిటో బయటపెట్టు!

'ఆయన కళాపోషకుడన్నానా! ఆయన సంస్థానంలో ఇటీవలే చేరిన బాలస్వామి అనే విద్వాంసుడున్నాడు.'

ఆ మాటలు దీక్షితుల చెవిని బడ్డాయి. ఆనందాశ్రువులు రాలాయి. వెంటనే జనసమూహాన్ని తోసుకొంటూవెళ్ళి ఆ యువకుల్ని సమీపించారు.

'బాలస్వామికి ఏం జరిగింది నాయనా!' ఉత్కంఠతో అడిగారు దీక్షితులు.

'బాలస్వామిగారికి రేపే వివాహం.'

ఆనందతాండవం చేశారు దీక్షితులు. 'ఆనందనటన' అని ఎలుగెత్తి చిదంబర నటేశుని కీర్తన గానం చేశారు. సంతోషపర వశంతో ఆ యువకుల్ని ఆలింగనం చేశారు.

'బాలస్వామి నా తమ్ముడు. అతనిజాడ తెలియక నేను ఇంతవరకు తిరుగాడుతున్నాను. మీ నోటివెంట పెరుమాళ్ళు ఈ శుభవార్త పలికించాడు. నేనిదే ప్రయాణమై ఎట్టయపురం వెళ్ళాలి, అని దీక్షితులు క్షణకాలం మౌనం వహించారు.

మధుర మధురంగా ఆర్ద్రకంఠంతో 'వెంకటేశ్వర ఎట్టప్ప భూపతి మాశ్రయేహం' అని నూత్నకీర్తన శిష్యునికోసం రచించారు. మేఘరంజనిలో వెలువడ్డ ఆకీర్తనను శిష్యుడు సుబ్రహ్మణ్యయ్య కంఠస్థం చేశారు.

వివాహానికి సంబంధించిన వార్తలు తెలుసుకోవాలనే కుతూహలం దీక్షితులవారి భార్యలకు కలిగింది. కృష్ణమాచారిద్వారా వార్తలు సేకరించారు. రామేశ్వరంనుండి రప్పించిన వధువుతో బాల

స్వామికి వివాహం జరిపిస్తున్నారు ప్రభువులు. పేలాదివైష్ణవులు ఆ వివాహానికి హాజరవుతున్నారు.

ఎట్టయాపురప్రయాణం:

వైష్ణవపదువులతోపాటు సకుటుంబంగా బయలుదేరారు దీక్షితులు. దారిపొడుగునా ఆనందోత్సాహాలతో కీర్తనలు గానంచేస్తూ న్నారు. మార్గాయాసం తెలియడమేలేదు. వివాహానికివెళ్ళే సంతోషం కన్నా తనతమ్ముడిజాడ తెలిసిందనే సంతోషం మీద మిక్కిలి సంబరం కలిగిస్తోంది. దారినడకన గ్రామాలు దాటుకుంటూ వెళ్తున్నారు.

సభలో సర్పం ఆడింది:

బాలస్వామిదీక్షితుల్ని చూడాలనే కోరిక ముత్తుస్వామికి మార్గశ్రమలేకుండా చేస్తోంది. బాలస్వామి చిన్నతమ్ముడు. సంస్కృ తాంధ్రాలలో మంచి పాండిత్యంగలవాడు. సంగీతలక్ష్య లక్షణ మర్మాలు తెలిసిన ప్రజ్ఞాశాలి. ఆంగ్లేయ సంగీతంలోను హిందూ స్థానీ సంగీతంలోను పాండిత్యం సంపాదించి మనలి సంస్థానాధీ శుల ప్రశంసలందుకొన్నాడు. పెద్దతమ్ముడు చిన్నస్వామి వైణిక శ్రేష్ఠుడు. రాజసభలలో గౌరవం పొందిన మహానుభావుడు. ఒకనాటి

సభలో చిన్నస్వామి 'నాగవరాళి' రాగం ఆలాపించగా పెద్దసర్పం పడగవెత్తి ఆడుతూ నిలిచింది. సభాసదులు కలకలం చెందారు. ముత్తుస్వామి అదిచూసి 'సోదరా! నీవు భయపడవద్దు. వీణను నిలుపక వాయించు'మని ఆజ్ఞ పురమాయించారు. ఆ గానామృతానికి, లోబడి సర్పం పడగ దించి నమస్కరించి వెళ్ళిపోయింది. అలాంటి తమ్ముళ్ళపై ముత్తుస్వామికి ఎనలేని అభిమానం!

ఎట్టయాపురానికి నడచివస్తూ ముత్తుస్వామి మార్గాంతరంలో అనేకగ్రామాలు సందర్శించారు. ఒకచోట వర్షంలేక ఎండిపోయిన పైరు కంటబడింది. సరసహృదయుడైన ముత్తుస్వామి హృదయం ద్రవించింది. చేతికందివచ్చినపైరు నాశనమవుతోందనే బాధ మనసును కలచివేసింది. కనికరంతో చలించిపోయారు. ఒక్క క్షణం సమీపంలోఉన్న చెట్టునీడకు వెళ్ళారు. శిష్యులు, కుటుంబమూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. వలవలా కన్నీరు కారుస్తున్న ముత్తుస్వామిస్థితి వారిని కలవరపరిచింది. కారణం తెలిసి వారు ఆశ్చర్యపోయారు.

## అమృతవర్షిణిరాగంతో మహావర్షం:

ఇంతలో ముత్తుస్వామి ధ్యాననిమగ్నులయ్యారు. అమృతేశ్వరీ దేవి నుపాసించారు. అమృతవర్షిణిరాగంలో కీర్తన అందు

కొన్నారు. 'ఆనందామృతవర్షిణి అమృతకర్షిణి' "అని కరుణరస భరితంగా గానంచేశారు. ప్రకృతి పులకించిపోయింది. చుట్టూవున్న జనం ఆశ్చర్యపరవశులయి తిలకిస్తున్నారు. శిష్యులు గురువుగారి అమృతవాక్కులను గ్రంథస్థం చేస్తున్నారు. అద్భుతంగా సాగిపోతున్న ఆ కీర్తనధారణి వారికి ఆనందాన్ని కలిగించింది. నిర్మలాకాశంలో నీలమేఘాలు తారసిల్లాయి. వర్షసూచనలు కనిపించాయి. ఆ పల్లెలో జనమంతా అక్కడికి చేరారు. ఎంతోకాలంగా కరువు కాటకాలతో కృశించిపోతున్న వారి ముఖాల్లో ఆనందం చిందు లేసింది.

సాక్షాత్తు వరుణదేవుడే ఈ రూపంలో వచ్చాడని భావించారు. తమకష్టాలు గట్టెక్కి, తమపంటలు పండే మంచికాలం వచ్చిందని సంతోషించారు. ఈ మహానుభావుని వృత్తాంతం ఏమిటని శిష్యుల ద్వారా తెలుసుకొన్నారు. వారి గాన మాధుర్యాన్నిగురించి తెలిసిన పండితులు పాదాభివందనం చేశారు. గ్రామ పెద్దలు మర్యాదపురస్సరంగా నమస్కరించి సంభావించారు. ముత్తుస్వామి ఇవేవీ గమనించే స్థితిలో లేరు. కీర్తన ఆలపిస్తూ పులకించిపోతున్నారు.

రాను రాను ఆకాశంలో మేఘాలు దట్టమయ్యాయి. క్షణ కాలంలో విపరీతమైన వర్షధారలు కురిశాయి. ఎవ్వరూ చెట్లచాటుకు

వెళ్ళలేదు. ఆనందంగా వర్షంలో తడిసి మురిసిపోతున్నారు. దీక్షితులవారు మళ్ళీ కీర్తన గానం చేయసాగారు.

ఆనందామృతకర్షిణి అమృతవర్షిణి
హరాదిపూజితే శివే భవాని
శ్రీనందనాది సంరక్షిణి
శ్రీగురుగుహజనని చిద్రూపిణి
సానందహృదయనిలయే సదయే
సద్యః సువృష్టిహేతవే ద్యాం
సతతం చింతయే అమృతేశ్వరి
సలిలం వర్షయ వర్షయ వర్షయ
ఆనందామృతకర్షిణి— అని గానంచేసేసరికి

సకల చరా చర జగత్తు వర్షధారలతో తడిసిపోయింది. గ్రామస్థుల ఆనందానికి అవధులులేవు.

ఆ ప్రాంతమంతా రేగటినేల. ముత్తుస్వామి ప్రయాణం చేస్తున్నది రెండుచక్రాలబండి. ఆ వర్షం తాకిడికి రేకటినేలలో బండిచక్రాలు కూరుకొనిపోయాయి. శిష్యులుక్రమంగా గ్రహించారు. వెల్లువ తగ్గిపోయింది. గ్రామస్థులు ఆ రోజు తమగ్రామంలో విడిది

చేయాల్సిందిగా ముత్తుస్వామిదీక్షితులను బలవంతం చేశారు. కాని వారి కోరిక అంగీకరించలేదు దీక్షితులు. కారణం తన లక్ష్యం సోదరుని వివాహానికి అందుకోవాలి. బండిని బైటకు లాగారు గ్రామస్థులు. మేళతాళాలతో వీడ్కోలు చెప్పారు.

అన్నదమ్ములు కలిశారు :

తనతో వచ్చిన యువకులు బండితోలడంలో సహకరించారు. సంకటపరిస్థితుల్లో బండి మెల్ల మెల్లగా బయలుదేరింది. గ్రామస్థులు కొంతదూరం వచ్చి దీక్షితులవారిని సాగనంపారు. క్రమంగా ప్రయాణం సాగించి బంధుజనంతో ఎట్టయాపురానికి చేరుకొన్నారు ఆ సాయంకాలం. తమ్ముణ్ణిచూసి సంబరపడ్డారు.

అన్నదమ్ముల ప్రగాఢ వాత్సల్యం చూసి శిష్యులు అబ్బుర పడ్డారు. కుశల ప్రశ్నలతో కాలం గడిచిపోయింది. ఎంతోకాలంగా తమ్ముడిగూర్చిన ఆందోళన ఆనాటితో తీరిపోయింది. ఆ రాత్రి ఇద్దరు సోదరులు (కొత్త కొత్త రాగాలలో) తాము ఇటీవల స్వర పరచిన కీర్తనలు ఒకరికొకరు వినిపించుకొని సంతోషించారు.

వివాహానికి విచ్చేసిన బంధుజనమూ, శిష్యులు ఆ కోలా హలంలో భాగస్వాములయ్యారు. మహారాజావారు విడిది ఏర్పాట్లన్నీ

స్వయంగా తామే చూచుకొంటున్నారు. తమ ఇంట్లోపెళ్ళిగా భావించి కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తున్నారు. రామేశ్వరం నుంచి విచ్చేసిన పెండ్లికుమార్తె పక్షంవారికి ప్రత్యేకంగా విడిది ఏర్పాటు చేశారు. ఆరాత్రి సంగీతకచేరీ ఏర్పాటు చేశారు.

నాదజ్యోతికి నమస్కారాలు!

మహారాజావారు బాలస్వామిదీక్షితుల ప్రతిభకు సన్మానంగా ఇల్లుకట్టించారు. అందులోనే బాలస్వామినివాసం. రాజుగారికి ముత్తుస్వామి రాకను తెలియజేశారు వార్తాహరులు. కాలినడకన విచ్చేసి పాదాభివందనం చేశారు మహాప్రభువులు. 'నాదజ్యోతి'కి మా సంస్థానం పక్షాన సాష్టాంగ నమస్కారాలు అర్పిస్తున్నామన్నారు. అప్పటికే ముత్తుస్వామి దీక్షితులకీర్తి దశ దిశలా ప్రాకింది.

ప్రభువులవారు ముత్తుస్వామి స్వరపరచిన మేఘరంజని కీర్తనను పాడవలసిందిగా కోరారు. ప్రభువుల కోరికను మన్నించారు దీక్షితులు. ఎంతగానో ఆనందించారు మహారాజా. ఆరాత్రి ప్రభుసాన్నిధ్యంలోను, సోదరునితో సంభాషణలోను కాలం గడచి పోయింది. శిష్యులు, బంధువులు ముత్తుస్వామి సంగీత సాధనలో గడించిన అత్యుత్తమ కీర్తిప్రతిష్ఠలకు ఆనందించారు. లౌకిక

సంసారబంధాలలో తగుల్కొనని దీక్షితులవారి కది లెక్కలోనిది కాదు.

వివాహం నాటి సూర్యోదయం ముత్తుస్వామివారు సూర్య దేవుని స్తుతిస్తూ తాము గానంచేసిన కీర్తన ఆలపించారు.

"సూర్యమూర్తే నమోఽస్తుతే- సుందర ఛాయాధిపతే
కార్యకారణాత్మక జగత్ప్రకాశ సింహరాశ్యాధిపతే
ఆర్యవినుత తేజః స్ఫూర్తే ఆరోగ్యాది ఫలదకీర్తే"

ఇలా సంతోష పారవశ్యంతో తమ్ముడి వివాహ శుభసందర్భంలో సూర్యోపాసన చేశారు ముత్తుస్వామిదీక్షితులు.

మహారాజులవారు స్వయంగా వివాహవేడుకలు జరిపించారు. ఉభయపక్షాలవారు ఆ సందర్భాల్లో పాల్గొన్నారు. ముత్తుస్వామి లౌకిక విషయాలలో ఆసక్తి కనబరచేవ్యక్తి కాకపోయినా తమ్ముని వివాహ సమయంలో ఆనందంగా బంధువుల్ని పరామర్శించారు. బంధువుల కోరిక మేరకు ఆ సాయంసమయంలో కీర్తనలు స్వయంగా గానం చేశారు. మరికొన్ని శిష్యులు గానం చేశారు.

ముత్తుస్వామి దీక్షితుల కీర్తనలలో ప్రత్యేకత అన్నికీర్తన లలోను తన యిష్టదైవమైన సుబ్రహ్మణ్యస్వామి పేరు వచ్చేలా

'గురుగుహ' ముద్ర పొందుపరచడం. అలానే ఆయా కీర్తనల రాగాలనుకూడ ఆకీర్తనలోనే జొప్పించారు. ఇలా ఒక నూత్న సంప్రదాయాన్ని దీక్షితులవారు పాటించారు. జనులంతా ఆ మహనీయుని కీర్తించారు.

**తిరువారూరు ప్రయాణం:**

వివాహ వేడుకలు పూర్తి కాగానే తిరువారూరికి ప్రయాణం సమకట్టారు ముత్తుస్వామిదీక్షితులు. కొత్త పెళ్ళికూతురుకు తోడుగా దీక్షితులవారు తమ పెద్దభార్యను అక్కడే నిలిపారు. చిన్నభార్యతోను, శిష్యసముదాయంతోను రాజావారిదగ్గర సెలవు పుచ్చుకొన్నారు. రాజావారు తమ సంస్థానంలో మరికొంతకాలం ఉండమని ప్రాధేయపడ్డారు. సుహృద్భావంతో పలికిన ఆ పలుకులకు సంతోషంగానే సమాధానం చెప్పి తిరువారూరికి బయలుదేరారు. రాజావారిచ్చిన కానుకలు తమ్ముడికే అందించారు. భగవద్భక్తి సంకీర్తనమే తనకానందమని మార్గమధ్యంలో కీర్తనల ఆలాపంతో సంతోషంగా తిరువారూరుచేరారు. గ్రామస్థులు ఎదురుగావెళ్ళి స్వాగత సన్నాహాలు నిర్వహించారు. తమ్ముడి వివాహసంరంభం వారికి తెలియజేశారు దీక్షితులు.

వయసు పెరిగేకొద్దీ ఆధ్యాత్మిక చింతన హెచ్చింది. భగవత్ సంకీర్తనంలో కాలక్షేపం చేయడం అలవాటయింది. తీరిక సమయాల్లో తనకంటె పెద్దవారైన త్యాగయ్య, శ్యామశాస్త్రిగారలను

కలిసి సంగీత శాస్త్రచర్చలు జరిపేవారు. అది 1834 వ సంవత్సరం. తనకు అరువదులు వయస్సు ప్రవేశించింది. కుటుంబభారం పెరగక పోయినా, వయోభారం పెరిగింది. తిరువారూరిలోని దేవాలయాలన్నీ సాయంకాలం సేవించేవారు. అక్కడి ప్రాకారంలో నవగ్రహాలున్నాయి. అవి వేర్వేరు దిక్కులలోగాక ఒకే వరుసలో స్థాపించడం విశేషం. నవగ్రహస్తోత్రం చేస్తూ కాలక్షేపం చేసేవారు.

మంచిని స్వీకరించే మనసు:

కేవలం ఛాందసభావాల ప్రభావంతో కొట్టుకపోలేదు దీక్షితులు. అప్పటికి ఆంగ్లభాషాప్రభావం భారతీయులపై ప్రసరిస్తోంది. ఆంగ్లేయుల జాతీయగేయం సభలలో పాడగా విన్నారు. ఇతర గేయాలు, వాటి రా ధోరణి దీక్షితుల మనసు నాకర్షించాయి. హిందూస్థానీ సంగీతబాణీ తనకు నచ్చింది. తనకృతులలో ఆబాణీని స్వీకరించారు. పులివాళందేవుని పేర మణిప్రవాళశైలిలో ఒక కీర్తన రచించారు.

ఎట్టయాపురంనుంచి లేఖ:

మన్మథనామ సంవత్సరం వచ్చింది. ఎట్టయాపురంనుండి రాజదూతలు ముత్తుస్వామి దీక్షితులవారికి ప్రభువులవారినుండి లేఖ తెచ్చారు. కుశలప్రశ్నల తర్వాత దీక్షితులు లేఖ చదివారు.

'మహారాజరాజశ్రీ నాదజ్యోతి ముత్తుస్వామి దీక్షిత గురు చరణులకు ఎట్టయాపుర ప్రభువుల వందనాలు. మీరు మాదగ్గరి

నుంచి వెళ్ళింది మొదలు మీ యోగక్షేమాలు తెలియవు. ఇటీవల మా రాజ పురోహితుల ఆదేశం మేరకు మా జ్యేష్ఠ పుత్రునకు వివాహము నిశ్చయించినాము. మీరు మా ఆహ్వానపత్రికను మన్నించి మాకుమారుని వివాహవేదికపై ఆశీర్వదించి మమ్ము తరింపజేయగలరని మనవి."

ఉత్తరం సాకల్యంగా చదివి దీక్షితులు నిశ్వాసం విడిచారు. ప్రభువుల ఆహ్వానాన్ని అంగీకరించామని చెప్పిపంపారు. రాజ దూతలు తిరిగి వెళ్ళిపోయారు.



అంతిమయాత్ర :

వివాహానికి బయలుదేరే ప్రయత్నంలో దీక్షితులు శిష్యుల దగ్గర బంధువుల దగ్గర వీడ్కోలు చెప్పారు. తాను వయోభారంవల్ల తిరిగి తిరువారూరు రాలేనని స్పష్టంగా చెప్పాడు. కుటుంబంతో ఎట్టయాపురానికి బయలుదేరారు. తిరువారూరులోని సంగీత విద్వాంసులు, శిష్యులు సజలనయనాలతో వీడ్కోలు చెప్పారు.

ఎట్టయాపుర పొలిమేరలో మహారాజు స్వాగత సత్కారాలు నిర్వహించారు. తమ్ముని కుటుంబంతో కలిసి వివాహ వేడుకల్లో పాల్గొన్నారు దీక్షితులు. యువరాజులవారి వివాహానికి వివిధ ప్రాంతాలనుండి బంధుజనం విచ్చేశారు. సంగీత సాహిత్య

విద్వాంసులకు సన్మానాలు జరిగాయి. దీక్షితులవారు ప్రభుస్తులకోరిక మీద నవావర్ణకృతులను గానం చేశారు. మానవాంకితంగా రచనలు చేయడం దీక్షితుల స్వభావానికివిరుద్ధం. ప్రభువులు అలా కోరలేదు గూడ.

జీవనసంధ్యాసమయం ఆసన్నమైందని ముత్తుస్వామి గ్రహించారు. మన్మథనామ సంవత్సర (1835) తులాకృష్ణ చతుర్దశీ దినం. శిష్యబృందంతో ముచ్చటిస్తున్నారు. దీక్షితులవారు పూర్వీకల్యాణిలోని 'మీనాక్షి మే ముదం' అనే కృతిని గానం చేయ మన్నారు శిష్యులను. శిష్యులు బృందంగా గానం చేశారు.

'మీనలోచని పాశమోచని' కీర్తన గానం చెయ్యమన్నారు. శిష్యులు గురువు ఆదేశం పాటించారు. రెండోమారు అదే కీర్తన గానం చేయమన్నారు. చివరలో ధ్యాననిమగ్నులైన దీక్షితులవారు రెండుచేతులు పైకెత్తి అంజలిఘటించి 'శివే పాహి' అని చివరిశ్వాస వదిలారు. నాదజ్యోతి ఆరిపోయింది.

వారి కీర్తనలను దేశమంతటా వ్యాపింపజేసి శిష్యులు గురువుగారి ఋణం తీర్చుకొన్నారు.

